# హనుమత్పంచరత్నం

వీతాఖిల విషయేచ్ఛం జాతా నందాశ్రు పుంక మత్యచ్ఛం
సీతాపతి దూత్యాద్యం వాతాత్మజ మద్యభావయే హృద్యం ||1||
సమస్త విషయ వాంఛలను త్యజించినవాడును, ఆనంద పారవశ్యముచే పులకాంకితుడై, ఆనంద బాష్పములను కలిగినవాడును, సీతాపతి యగు శ్రీ రాముని సేవకులలో అగ్రగణ్యుడును, వాయునందనుడును అగుహనుమంతుని నా హృదయమున ధ్యానింతును.
తరుణారుణ ముఖకమలం కరుణారస పూర పూరితాపాంగం
సంజీవన మా శాసే మంజుల మహీమాన మంజనా నుం ||2||
అప్పుడే విప్పారిన యెఱ్ఱనైన కమలము వంటి ముఖముగలవాడును, కరుణా రసపూరిత కటాక్షములు గలవాడును, మనోహరమైన వైభవో పేతుడును, అంజనీపుత్రుడైన ఆంజనేయుని నాకుసదా సంజీవనముగా భావించి ధ్యానించుచున్నాను.
శంబరవైరి శరాతిగ మంబుజదళ విపుల లోచనోదారం
కంబుగళ మనిల దిష్టం బింబ జ్వలి తోష్ఠ మేక మవలంబే ||3||
మన్మథ బాణముల కతీతుడును, తామర రేకులవలె విశాలములైన కన్నులతో ఉదారుడుగా గన్పట్టువాడును, శంఖమువంటి కంఠము గలవాడును, దొండపండువలె ఎఱ్ఱనైన క్రింద పెదవి గలవాడును, వాయునందనుడును అగు ఆంజనేయుని ఆశ్రయించుచున్నాను.
దూరీకృత సీతార్తిః ప్రకటీకృత రామ వైభవస్ఫూర్తిః
దారిత దశముఖ కీర్తి పురతో మమభాతు హనుమతో మూర్తిః ||4||
సీతయొక్క దుఃఖమును పోగొట్టి, శ్రీ రాముని వైభవమును సర్వత్రా ప్రకటించి, రావణుని కీర్తిని నశింపజేసిన హనుమంతుని దివ్యమూర్తి నా కనుల ముందు ప్రత్యక్షమగుగాక!
వానర నికరాధ్యక్షం దానవకుల నికర కుముద రవికర సదృశం
దీన జనావన దీక్షం పవనతపః పాక పుంజ మద్రాక్షం ||5||
వానరసమూహమునకు ప్రభువును, రాక్షసులనెడి కలువలకు సూర్యుని వంటివాడును, దీన జనులను రక్షించు దీక్ష గలవాడును, వాయు దేవుని పుణ్యఫలవిశేషమునుయైన పవనసుతుని జూడ నుత్సాహ పడుచుంటివి.

## ఫలశ్రుతి

ఏత త్పవన సుతస్య స్తోత్రం యః పఠతి పంచరత్నాఖ్యం
చిరమిహ నిఖిలాన్ భోగాన్ భుక్త్వా శ్రీ రామ భక్తిమాన్ భవతి.
పంచరత్నమను పేరుగల ఈ పవనసుతుని స్తోత్రమును ఎవరు పఠింతురో వారు చిరకాలము ఈ ప్రపంచమున భోగముల ననుభవించి చివరగా ఆంజనేయునివలె శ్రీ రామభక్తులు కాగలరు.
ఇతి శ్రీ శంకర భగవత్పాద విరచిత హనుమత్పంచరత్నమ్
ఇది శ్రీ శంకర భగవత్పాదాచార్యులు రచించిన హనుమత్పంచ రత్న స్తోత్రము సంపూర్ణమ్.